బ్రహ్మాదిదేవతలంగరుచు పూర్వమానవులకు ప్రత్యక్షమై వరము లిచ్చుచుండిన మాటలు వాస్తవమేనా? యిప్పు డట్లు రారేల? మన మతములో చెప్పిన యీ మాటలలో నెంత సత్యమున్నది? వేదాలు బ్రహ్మముఖమున పుట్టిన వనుటలో గల యధార్థమెంత? మొదటిదైన ఋగ్వేద మెప్పు డెచట నెవరిచే వ్రాయబడినది? ఆకాలపు దేవత లెవ్వరు? మానవులు మొదట నెచట యుత్పత్తిమైరి? హిందూదేశము హిందూమతము అను పదము లెట్లుత్పత్తియైనవి? మన దేశపువాస్తవిక చరిత్ర యెంతవరకుయేరీతిగా లిఖితమై యున్నది? ఖగోళవిషయమై మన కున్న గణితశాస్త్రములు వానిని బట్టి మనకు తెలిసే విషయాలు, యజ్ఞాదులలో దేవతల హవిస్సులు, వాని ఫలాలు యెంతవరకు నిజం? ఈ విషయాలన్నిటిని విమర్శనాదృష్టితో వీక్షించి సత్యాన్వేషణ నొనర్చి యసంబద్ధ ప్రలాపాలను ఎట్టి పవిత్రగ్రంథములో నున్నను వానిని త్రోసిరాజని, యితరదేశములలో యీ విషయమైన రుజువు లున్నవేమో సరిజూచి, మనదేశములో దొరకెడి పూర్వశాసనాలు మొదలైన పరమప్రమాణములతో దర్కించి వాస్తవికజ్ఞాన ప్రకటనకొరకే యీ గ్రంథ ముద్దేశింపబడినది.

ఇట్టి సత్య సిద్ధాంతమును తెలుపుటలో చారిత్రకముగా రుజువగు విషయములనే నమ్ముచున్నను మతభక్త్యాదుల యుద్ధరణకై వచింపబడిన పూర్వ ఋషిపుంగవుల ప్రమాణవాక్యములనుకూడ త్రోసివేయుటలో వారి యెడల ననాదరణభావము కాదు. సత్యాన్వేషణకొరకు వారివారి గొప్పయూహలను శ్లాఘించుటయే యగును. ఇక విచారణకు వత్తము.

గ్రీన్‌విచ్ నక్షత్రశాలలో పరిశోధకుడుగా గొంతకాలముండిన సుప్రసిద్ధ ఖగోళశాస్త్రజ్ఞుడగు మేజరు జనరల్ డ్రేసను పండితుడు (వూల్‌విచ్చిలో రాయల్ మిలటరీ అకాడమీ ప్రొఫెసరు) అనేక పరిశోధనలు సలిపి క్రీస్తుపూర్వము 14 వేల సం॥ల క్రిందట ఏషియా మధ్యదేశము మానవ నివాసమునకు వీలుకాని గొప్ప మంచుచే గప్పబడి యుండెననియు, రష్యా మున్నగు ప్రదేశములలో క్రీ. పూ. 4000 సం॥ల వరకు నట్లుండెననియు, సెంట్రలు ఏషియాలో నాకాలమున సూర్యరశ్మి వేడిమి (Altitude) 35 ½ డిగ్రీలు



మాత్రమే యుండుననియు నిర్ధారించియుండెను. దీనినే తర్వాత పెక్కండ్రు విదేశశాస్త్రకారు లంగీకరించియుండిరి. దీనిప్రకార మచటినుండి యార్యులు మనదేశమున కాలిడిరను సిద్ధాంతము ననుసరించి యాకాలపు పూర్వవిషయములుగా నెచ్చట జెప్పబడినను నమ్మరానివిగా నిర్ధారణ యగును. కొందరు పండితులు మన వేదభాగములలో బ్రాహ్మణములందు కొన్నిచోట్ల వసంత, విషువత్తు కృత్తికా మృగశిరల కాలములో వచ్చినట్లు గల వాక్యములనుబట్టి యాకాలము క్రీస్తుపూర్వము 3 లేక 4 వేల సం॥ల క్రిందటనైయుండునని లెక్కించుచున్నారు. ఋగ్వేదములో నొకచోట యింద్రుడు చిత్తలో నున్నట్లు చెప్పబడినది. ఇదిగూడ విషువత్తు కథనముగానే భావించుచు, నాకాలము క్రీస్తుపూర్వము 13800 సం॥ల క్రిందటిదని కొందరు పండితులు వాదించుచున్నారు. మరియొకచోట ఋగ్వేదములో అశ్వినిలోని విషువత్తు ప్రస్తావన గలదు. ఆ విషువత్తు క్రీస్తుపూర్వము మన పూర్వ లెక్కలప్రకారము 28800 సం॥ లనియు (పావన సం॥లు కావచ్చును) నవీన సిద్ధాంతరీత్యా 26600 సం॥ లగుననియు క్రీస్తుపూర్వము దాదాపు 60 సం॥ల క్రిందట మరల నట్టి యశ్వినీవిషువత్తు పరిభ్రమణము వచ్చెననియు కొందరు పరిశోధకులు నుడివిరి. గాని పైన నుడివిన యశ్వినీ చిత్తలలోని విషువత్తులు లెక్కలచే చెప్పబడినవేనా? లేక నప్పటినుండి మానవులు మన దేశమున నుండి ఖగోళ విజ్ఞానవంతులై యున్నారా యని విచారించిన కొలదిని డ్రేసను పండితాభిప్రాయానుసారముగ నేమి, మన పూర్వ కథలనుబట్టియేమి నమ్ముటకు వీలు కానిదిగ నున్నది. మన కథలన్నియు కోట్ల సం॥లతో మానవజీవితములను నింపివైచినందున సత్యమును వెలికిదీయుట కష్టమగుచున్నది. విషువత్తు పరిభ్రమణము 7200 సం॥ల కొకసారి యుండునని సూర్యసిద్ధాంతము వలన దెలియుచున్నది. ఇది నక్షత్ర పాదము వ్యత్యాసము గమనింపకుండా చెప్పుపద్ధతి. ఈ రెండుపద్ధతులలో నేది ఋగ్వేదమున జెప్పబడినదో గ్రహించినగాని వేదకాలనిర్ధారణ గానందున ముందుగా నితర విధముల దీనిని బరిశీలింతము. డాక్టరు అనిబిసెంటు మొన్నగువారు వేదకాల విషువత్తు